


శ్రీశైలానంత పూరుషవంశ ముక్తాఫలాయమానులు,
తిరుపతి నివాసులు చతుఃశాస్త్ర విద్వద్వరేణ్యులు
**ఉ.వే. శ్రీమాన్ తిరుమలై అనన్దాణ్పిళ్ళై**
**పురిశై శ్రీరంగాచార్యస్వామివారిచే రచింపబడిన**

# లక్ష్మీగద్యమ్, శ్రీనివాసగద్యమ్

**ప్రతిపదార్థంతో**

ప్రచురణ
**ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్ట్**
**తిరుమల తిరుపతి దేవస్థానములు**
**తిరుపతి - 2013**

# లక్ష్మీగద్యమ్, శ్రీనివాసగద్యమ్
## ప్రతిపదార్థంతో

ప్రచురణ : ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్ట్, తి.తి.దే., తిరుపతి

వెల : అమూల్యము.

మొదటి ముద్రణ : 2016

ప్రతులు : 2000

ప్రకాశకులు :

**శ్రీ సాంబశివరావు,** ఐ.ఏ.ఎస్.

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి - 517 507

ముద్రణ :

తి.తి.దే. ముద్రణాలయం

తిరుపతి-517 507



శ్రీశైలానంత పూరుషవంశ ముక్తాఫలాయమానులు
చతుఃశాస్త్ర విద్వద్వరేణ్యులు ఉ.వే. శ్రీమాన్ తిరుమలై అనన్దాణ్ పిళ్ళై
పురిశై శ్రీరంగాచార్యస్వామివారిచే ప్రణీతమైన

# లక్ష్మీగద్యమ్

1. **శ్రీవేంకటేశమహిషీ శ్రితకల్పవల్లీ**
**పద్మావతీ విజయతా మిహ పద్మహస్తా।**
**శ్రీవేంకటాఖ్యధరణీభృదుపత్యకాయాం**
**యా శ్రీశుకస్య నగరే కమలాకరేఽ భూత్॥**

శ్రీవేంకటాఖ్యధరణీభృత్ = శ్రీవేంకటాచలమను పేరు గల కొండయొక్క, ఉపత్యకాయామ్ = పర్వతసమీప ప్రాంతమునందు గల, శ్రీశుకస్య నగరే = శ్రీశుకనగరమునందలి (తిరుచానూరులోని), కమలాకరే = పద్మసరస్సులో, యా= ఏ పద్మావతీదేవి, అభూత్ = అవతరించెనో, అట్టి, శ్రీవేంకటేశమహిషీ= శ్రీవేంకటేశ్వరుని పట్టపురాణి, శ్రితకల్పవల్లీ = భక్తులకు కల్పలతవంటిది, పద్మహస్తా = పద్మమును చేతియందు కల్గినది (పద్మమువంటి అందమైన హస్తములను కల్గినది) అయిన, పద్మావతీ = పద్మావతీదేవి, ఇహ = ఇచట (భూలోకమున), విజయతామ్ = సర్వోత్కర్షతో వెలుగొందుగాక !

1. **భగవతి ! జయ ! జయ! పద్మావతి హే !**

హే పద్మావతి = ఓ పద్మావతీదేవీ !, భగవతి = పూజ్యురాలా !, జయ జయ = నీవు సర్వోత్కర్షతో ప్రకాశింతువుగాక !

2. **భాగవతనికర బహుతరభయకర బహులోద్యమ యమసద్మాయతిహే!**

భాగవత నికర = భక్తసమూహమునకు, బహుతర = చాలా గొప్ప, భయకర= భయమును కల్గించునట్టి, బహుల = అనేకములైన, ఉద్యమ = ప్రయత్నములను కల, యమసద్మ = నరకముయొక్క, ఆయతిహే = విస్తృతిని నశింపజేయుదానా!

**3. భవిజనభయనాశి భాగ్యపయోరాశి వేలాతిగలోల విపులతరోల్లోల వీచిలీలానివహే!**

భవిజన = సంసారిజనులయొక్క, భయనాశి = భయమును నశింపచేయు స్వభావమును కల్గినవి, భాగ్యపయోరాశి = అదృష్టము (సంపద) అను, సముద్రముయొక్క, వేలాతిగ = తీరమును అతిక్రమించినవి, లోల = చలించునవి, విపులతర = మిక్కిలి విస్తృతమైనవి, ఉల్లోల = ఉన్నతములైన, వీచి = కెఱటముల, లీలా = విలాసములను, అవహే = వెలువరించుదానా !

**4. పద్మజభవయువతి ప్రముఖామరయువతి పరిచారకయువతి వితతి సరతి సతత విరచిత పరిచరణ చరణాంభోరుహే !**

పద్మజభవయువతి = బ్రహ్మయొక్క, శివునియొక్క పత్నులగు సరస్వతీదేవి, పార్వతీదేవి, ప్రముఖ = మొదలగు, అమరయువతి = దేవతాస్త్రీలు అను, పరిచారకయువతి = పరిచారిక స్త్రీల, వితతి = సమూహములచే, సరతి= ప్రీతితో, సతత = ఎల్లప్పుడు, విరచిత = చేయబడిన, పరిచరణ = పరిచర్యను కల, చరణ+అంభోరుహే= పాదపద్మమును కలదానా!

**5. అకుంఠవైకుంఠ మహావిభూతినాయకి !**

అకుంఠ = అడ్డు లేని, వైకుంఠ = వైకుంఠము అను, మహావిభూతి = గొప్ప విభూతికి, నాయకి = నాయకురాలా!

**6. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకి !**

అఖిల= సమస్తములైన, అండకోటి = కోట్లాది అండములను కల, బ్రహ్మాండ = బ్రహ్మాండములకు, నాయకి = నాయకీ !

7. **శ్రీవేంకటనాయకి!** = శ్రీవేంకటేశ్వరుని నాయకీ !

8. **శ్రీమతి ! పద్మావతి!** = శ్రీమతీ ! ఓ పద్మావతీ !

9. **జయ విజయీభవ** = వర్ధిల్లుము ! విజయమును పొందుము.

**క్షీరాంభోరాశిసారైః ప్రభవతి రుచిరైః యత్స్వరూపే ప్రదీపే**
**శేషాణ్యేషామృజీషాణ్యజనిషత సుధాకల్పదేవాంగనాద్యాః ।**
**యస్యా స్సింహాసనస్య ప్రవిలసతి సదా తోరణం వైజయంతీ**
**సేయం శ్రీవేంకటాద్రిప్రభువరమహిషీ భాతు పద్మావతీ శ్రీః ॥**



రుచిరైః = ప్రకాశవంతములైన, క్షీరాంభోరాశిసారైః = క్షీరాబ్ధిలోని సారవంతము లైన పదార్థములచే, ప్రదీపే = మిక్కిలి గొప్ప దీపమువంటి, యత్= ఏ లక్ష్మీదేవి యొక్క, స్వరూపే = దివ్యరూపము, ప్రభవతి = అవతరించినది కాగా, ఏషామ్= ఈ సారములైన పదార్థములయొక్క, శేషాణి= మిగిలిన, ఋజీషాణి= సారరహితములైన పిప్పివంటి పదార్థములగు, సుధాకల్పదేవాంగనాద్యాః = అమృతము, కల్పవృక్షము, అప్సరసలు మొదలగు నవి, అజనిషత = ఉత్పత్తి అయినవో, యస్యాః = ఏ పద్మావతీదేవియొక్క, సింహాసనస్య = సింహాసనమునకు (భగవానుని వక్షఃస్థలమునకు), వైజయంతీ= వైజయంతీమాల, సదా = ఎల్లప్పుడు, తోరణం = తోరణమై (ద్వారా లంకరణమై), ప్రవిలసతి = విరాజిల్లుచున్నదో, సా= అట్టి, ఇయమ్ = ఈ, శ్రీవేంకటాద్రి ప్రభువరమహిషీ = శ్రీ వేంకటేశప్రభువు యొక్క మహిషి అయిన పద్మావతీదేవి, భాతు = ప్రకాశించునుగాక !

**1. జయ ! జయ ! జగదీశ్వర కమలాపతి కరుణారస వరుణాలయవేలే !**

జగదీశ్వర = లోకములకు ప్రభువగు, కమలాపతి = శ్రియఃపతియొక్క, కరుణారస = కరుణ అను గుణముయొక్క, వరుణాలయ = సముద్రమునకు, వేలే = అవధివంటిదానా!, జయ జయ = విజయీభవ, విజయీభవ.

**2. చరణాంబుజ శరణాగత కరుణారస వరుణాలయ మురబాధన కరబోధన సఫలీకృత శరణాగత జనతాగమవేలే !**

చరణాంబుజ= తన పాదములందు, శరణాగత = శరణాగతిని చేసినవారి విషయమున, కరుణారసవరుణాలయ = కరుణారస సముద్రుడగు, మురబాధనకర = మురవైరియగు భగవానుని ఉద్దేశించి చేసిన, బోధన = బోధనచే, సఫలీకృత = సార్థకతను పొందిన, శరణాగతజనతా = భక్తజనసమూహముయొక్క, ఆగమ = రాకయొక్క, వేలే = సమయమును కల్గినదానా !

**3. కించిదుదంచిత సుస్మితభంజిత చంద్రకలామద సూచితసంపద విమల విలోచన జితకమలానన సకృదవలోకన సజ్జనదుర్జన భేదవిలోపన లీలాలోలే !**

కించిత్ = కొంచెము, ఉదంచిత = పైకి వెలువడిన, సుస్మిత = చిఱునవ్వుతో, భంజిత = జయించిన, చంద్రకలామద = చంద్రకళయొక్క

గర్వమును కల్గినది, సూచిత = సూచింపబడి, సంపత్ = సంపదను కల, అవిమల = నల్లని (కాటుకరంగును కల), విలోచన = నేత్రములతో, జిత = జయించిన, కమల = పద్మమును కల్గినది అయిన, ఆనన = ముఖముతో, సకృత్ = ఒక మాఱు, అవలోకన = చూచుటద్వారా, సజ్జన దుర్జన = సజ్జనుల, దుర్జనుల మధ్య గల, భేద = తారతమ్యమును, విలోపన = పోగొట్టుట అనే, లీల = లీలలో (క్రీడలో) లోల = ఆసక్తిని కల్గినదానా !

**4.** **శోభనశీలే !**

మహనీయమైన స్వభావమును కల్గినదానా !

**5.** **శుభగుణమాలే !**

కల్యాణగుణముల సమూహమును కల్గినదానా !

**6.** **సుందరభాలే !**

అందమైన కనుబొమలను (లేక, ఫాలభాగమును) కల్గినదానా !

**7.** **కుటిలనిరంతర కుంతలమాలే !**

కుటిల =గుండ్రని, నిరంతర = దట్టమైన, కుంతలమాలే =దీర్ఘమైన కేశపాశమును కల్గినదానా !

**8.** **మణివరవిరచిత మంజులమాలే !**

మణివర విరచిత = గొప్ప రత్నములచే చేయబడిన, మంజులమాలే = మనోహరములైన హారములను కల్గినదానా!

**9.** **పద్మసురభిగంధ మార్దవమకరంద ఫలితాకృతిబంధ పద్మినీబాలే !**

పద్మ = పద్మముయొక్క, సురభిగంధ = సౌగంధ్యముయొక్క, మార్దవ = సౌకుమార్యము యొక్క, మకరంద = తేనెయొక్క, ఆకృతిబంధ = రూపముల సమాహారరూపమైన, పద్మినీబాలే = పద్మసరస్సునుండి పుట్టిన బాలికా!

**10.** **అకుంఠవైకుంఠ మహావిభూతినాయకి !**

ఏ అడ్డును లేని వైకుంఠములోని గొప్ప ఐశ్వర్యమునకు నాయకీ !

**11.** **అఖిలాండకోటి బ్రహ్మాండనాయకి !**

కోట్లాది సమస్తబ్రహ్మాండములకు నాయకీ !



**12.** **శ్రీవేంకటనాయకి !**

శ్రీవేంకటాద్రి విభుని నాయకీ !

**13.** **శ్రీమతి పద్మావతి !**

శ్రీమతీ ! పద్మావతీ !

**14.** **జయ విజయీభవ !** = వర్ధిల్లుము, విజయమును పొందుము.

**3.** **శ్రీశైలానంతసూరేః సధవముపవనే చోరలీలాం చరంతీ**
**చాంపేయే తేన బద్ధా స్వపతిమవరయ త్తస్య కన్యా సతీ యా ।**
**యస్యాః శ్రీశైలపూర్ణ శ్శ్వశురయతి చ హరే స్తాతభావం ప్రపన్నః**
**సేయం శ్రీవేంకటాద్రిప్రభువరమహిషీ భాతు పద్మావతీ శ్రీః ॥**

యా = ఏ పద్మావతీదేవి, శ్రీశైల+అనంతసూరేః = శ్రీశైల అనంతార్యులు పెంచిన, ఉపవనే = ఉద్యానవనమునందు, సధవం = తన భర్తతోపాటు, చోరలీలాం= చోరకృత్యమును, చరంతీ = చేయునట్టిదై, తేన = అనంతా చార్యులచే, చాంపేయే = సంపెంగ చెట్టుకు, బద్ధా = బంధింపబడినదై, తస్య= ఆ అనంతాచార్యులకు, కన్యా సతీ = కుమార్తెయై, స్వపతిం = తన భర్తయగు శ్రీనివాసుని, అవరయత్ = వరించెనో, హరేః = శ్రీనివాసభగవానునకు, తాతభావం = తండ్రియగుటను, ప్రపన్నః = పొందిన, శ్రీశైలపూర్ణః = శ్రీశైల పూర్ణులు, యస్యాః = ఏ పద్మావతీదేవికి, శ్వశురయతి = మామగారు అయ్యెనో, సా ఇయం = ఇట్టి, ఈ, శ్రీః = లక్ష్మీదేవి, శ్రీవేంకటాద్రిప్రభువరమహిషీ = శ్రీవేంకటేశ్వరుని పట్టపురాణియగు, పద్మావతీ = పద్మావతీదేవి, భాతు = ప్రకాశించునుగాక !

**1.** **ఖర్వీభవదతిగర్వీకృత గురుమేర్వీశగిరి ముఖోర్వీధరకుల దర్వీకరదయి తోర్వీ ధర శిఖరోర్వీఫణిపతి గుర్వీశ్వరకృత రామానుజముని నామాంకిత బహుభూమాశ్రయ సురధామాలయ వరనందనవన సుందరతరానంద మందిరానంత గురువనానంత కేళియుత నిభృతతర విహృతిరత లీలాచోర రాజకుమార నిజపతి స్వైరసహవిహార సమయ నిభృతోషిత ఫణిపతిగురు భక్తిపాశ వశంవద నిగృహీతారామ చంపకనిబద్ధే!**

ఖర్వీభవత్ = తక్కువగా చేయబడిన, అతిగర్వీకృత = మిక్కిలిగా గర్వించిన, గురు = గొప్పదైన, మేరు = మేరుపర్వతము, ఈశగిరిముఖ = కైలాసము మొదలగు, ఉర్వీధరకుల = పర్వతకులమును కల్గినదగు, దర్వీకరదయిత+ ఉర్వీధరశిఖర+ఉర్వీ = శేషాచల శిఖరముపై గల ప్రదేశములో, ఫణిపతి గురు+ఈశ్వరకృత = అనంతార్యులచే నిర్మింపబడిన, రామానుజ ముని నామాంకిత = భగవద్రామా నుజుల దివ్యనామమును కల్గినది, బహుభూమా+ ఆశ్రయ = గొప్ప మహిమకు నెలవైనది, సురధామ+ ఆలయ= దేవతల భవనములకు నిలయమైన స్వర్గములోని, వరనందనవన = గొప్ప నందనవనము కంటే, సుందరతర = మిక్కిలి అందమైన, ఆనందమందిర = ఆనందమందిరమైన, అనంతగురు= అనంతార్యునిచే నిర్మింపబడినది అగు, వన = ఉద్యానవనము నందు, అనంతకేలియుత = అనంతములైన లీలావిలాసములతో (క్రీడలతో) కూడిన, నిభృతతర = అతిరహస్యములగు, విహృతి = విహారములందు, రత = ఆసక్తుడై, లీలాచోర = లీలాచోరుడైన, రాజకుమార = రాజకుమారుని రూపములో నున్న, నిజపతి = తన భర్తతో, స్వైర = యథేచ్ఛముగా, సహవిహారసమయ = కలసి విహరించు సమయమున, నిభృత = రహస్యముగానున్న, ఉషిత = మేల్కొనియున్న, ఫణిపతిగురు = అనంతార్యగురుని యొక్క, భక్తి = భక్తి అనెడి, పాశ = పాశములకు, వశంవద = వశయై, నిగృహీత = పట్టుకొనబడినదానవై, అరామచంపక = ఉద్యానవనములోని సంపెంగచెట్టునకు, నిబద్ధే = బంధింప బడినదానా!

**2. భక్తజనావనబద్ధశ్రద్ధే !**

భక్తజన = భక్తులయొక్క, అవన = రక్షణయందు, బద్ధశ్రద్ధే = శ్రద్ధను కల్గినదానా !

**3. భజనవిముఖభవిజన భగవదుపసదన సమయనిరీక్షణ సంతతసన్నద్ధే !**

భజన విముఖ = భగవద్భజనయందు విముఖులైన, భవిజన = సంసారుల యొక్క, భగవదుపసదన సమయ = భగవానుని సమీపించుటకు తగిన సమయమును, నిరీక్షణ = ఎదురు చూచుటలో, సంతతసన్నద్ధే = ఎల్లప్పుడు సన్నద్ధయై (సిద్ధమై) యున్నదానా !



**4. భాగధేయగురు భవ్యశేషగురు బాహుమూలధృత బాలికాభూతే !**

భాగధేయగురు = అదృష్టములో గొప్పవాడగు (కావుననే), భవ్య = పవిత్రుడగు, శేషగురు = అనంతార్యునిచే, బాహుమూలధృత = (తన) చంకయందు ధరింపబడిన, బాలికాభూతే = బాలికయైనదానా !

**5. శ్రీవేంకటనాథవరపరిగృహీతే !**

శ్రీవేంకటనాథ వర = శ్రీనివాసుడను వరునిచే, పరిగృహీతే = పరిగ్రహింప బడినదానా !

**6. శ్రీవేంకటనాథతాతభూత శ్రీశైలపూర్ణగురు గృహస్నుషాభూతే !**

శ్రీవేంకటనాథ = శ్రీవేంకటేశ్వరునకు, తాతభూత = తండ్రియైన, శ్రీశైలపూర్ణగురుగృహ = శ్రీశైలపూర్ణులను ఆచార్యుల ఇంట, స్నుషాభూతే = కోడలుగా అయినదానా !

**7. అకుంఠవైకుంఠ మహావిభూతినాయకి !**

ఎట్టి అవరోధము లేని వైకుంఠనగరములోని దివ్యవిభూతికి నాయకీ !

**8. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకి !**

సమస్తములైన కోట్లాది బ్రహ్మాండములకు నాయకీ !

**9. శ్రీవేంకటనాయకి !**

శ్రీవేంకటేశ్వరుని నాయకీ !

**10. శ్రీమతి ! పద్మావతి !**

శ్రీమతీ ! పద్మావతీ !

**11. జయ ! విజయీ భవ !**

సర్వోత్కర్షతో వెలుగుము, విజయమును పొందుము.

**4.** శ్రీశైలే కేళికాలే మునిసముపగమే యా భయాత్ ప్రాక్ ప్రయాతా
తస్యైవోపత్యకాయాం తదను శుకపురే పద్మకాసారమధ్యే ।
ప్రాదుర్భూతాஉ రవిందే వికచదలచయే పత్యురుగ్రై స్తపోభిః
సేయం శ్రీవేంకటాద్రిప్రభువరమహిషీ భాతు పద్మావతీ శ్రీః ॥

శ్రీశైలే = శ్రీశైలమనబడు వేంకటాచలములో, కేళికాలే = లీలావిహార సమయ మున, మునిసముపగమే = మునులురాగా, యా = ఏ పద్మావతీదేవి, ప్రాక్ = పూర్వము, భయాత్ = భయమువలన, ప్రయాతా = వెడలినదో, (ఆ పద్మావతీదేవియే), తదను = పిమ్మట, తస్య = ఆ వేంకటాచలముయొక్క, ఉపత్యకాయామ్ ఏవ = పాదమూలప్రదేశమునందు గల, శుకపురే = శ్రీశుకపురమందు, పద్మకాసారమధ్యే = పద్మసరస్సు మధ్యలో, వికచదళచయే= వికసించిన రేకుల సమూహమును కల, అరవిందే =పద్మమునందు, పత్యుః = భర్తయగు శ్రీనివాసునియొక్క, ఉగ్రైః = తీవ్రములైన, తపోభిః = తపస్సుల కారణముచే, ప్రాదుర్భూతా = అవతరించినది, సా ఇయం = అట్టి, ఈ, శ్రీవేంకటాద్రి ప్రభువరమహిషీ = శ్రీవేంకటేశ్వరుని పట్టమహిషి, శ్రీః = లక్ష్మీదేవియు అగు, పద్మావతీ = పద్మావతీదేవి, భాతు = ప్రకాశించుగాక !

1. భద్రే ! = మంగళరూపిణీ !

2. **భక్తజనావననిర్నిద్రే!**

భక్తులను రక్షించుటలో నిద్రలేనిదానా! జాగరూకురాలా! (ఆలస్యము చేయనిదానా ! అని తాత్పర్యము)

3. **భగవద్దక్షిణ వక్షోలక్షణ లాక్షాలక్షిత మృదుపదముద్రే !**

భగవద్దక్షిణవక్షః = భగవానుని వక్షఃస్థలముయొక్క దక్షిణభాగమున - కుడివైపున, లక్షణ= గుర్తుగానున్న, లాక్షాలక్షిత= లత్తుకచే ముద్రింపబడిన, మృదుపదముద్రే = మృదువైన పదముల ముద్రలను కల్గినదానా!

**4. భంజితభవ్యనవ్య దరదలిత దలమృదుల కోకనదమద విలసద ధరోర్ధ్వ విన్యాస సవ్యాపసవ్యకర విరాజదనితర శరణభక్తగణనిజచరణ శరణీకరణాభయ వితరణ నిపుణనిరూపణ నిర్నిద్రముద్రే !**

భంజిత = భగ్నము చేయబడిన, భవ్య = అందమైన, నవ్య = నూతనమైన, దర దలిత దల = కొంచెము వికసించిన దళములను కల, మృదుల = సున్నిత మైన, కోకనద = రక్తోత్పలముయొక్క, మద = మదమును కల్గిన, విలసత్ = ప్రకాశించుచున్న, అధర = క్రింది, ఊర్ధ్వ = పైదిశలో, విన్యాస = స్థితిని కల,



సవ్య+అపసవ్య = కుడివైపు, ఎడమ వైపులలోని, కర = చేతులయందు, విరాజత్= ప్రకాశించుచున్న, అనితర శరణ భక్తగణ = (దివ్యదంపతులకంటె) వేఱు శరణము లేని భక్తుల సమూహమునకు, నిజచరణ = తన చరణములను, శరణీకరణ = శరణముగా చేయుటలోను, అభయ వితరణ = అభయ ప్రదానమును చేయుటలోను, నిపుణ = సమర్థురాలగుటను, నిరూపణ = నిరూపించు, నిర్నిద్రముద్రే = వికసించిన (పూవుయొక్క) ముద్రను కల్గినదానా!

**5. ఉల్లసదూర్ధ్వతరాపర కరశిఖరయుగళశేఖర నిజమంజిమ మదభంజన కుశల వదన విధుమండల విలోకన విదీర్ణహృదయతా విభ్రమధర దరవిదలిత దలకోమల కమలముకుల యుగలనిరర్గల వినిర్గలత్కాంతిసుముద్రే !**

ఉల్లసత్ = మిక్కిలి ప్రకాశించుచున్న, ఊర్ధ్వతర = పూర్వము వర్ణింప బడిన హస్తములకంటె మిక్కిలి ఎత్తుగానున్న, అపర = వేఱొక, కరశిఖరయుగళ శేఖర = గొప్ప కరాగ్రముల జంటయందు (హస్తద్వయమందు), నిజ = తన యొక్క, మంజిమ = సొబగుయొక్క, మద = గర్వమును, భంజన = భగ్నము చేయుటలో, కుశల = సమర్థమైన, వదనవిధుమండల = ముఖమను చంద్ర మండలమును, విలోకన = చూచుటచే, విదీర్ణ = పగిలిన, హృదయతా = హృదయమును కల్గియుండుటయొక్క, విభ్రమ ధర = విలాసమును (భ్రమను) దాల్చినవై, దర = కొంచెము, విదలిత = విచ్చిన, దల = రేకులను కల, కోమల= సుకుమారములైన, కమలముకులయుగళ = పద్మములయొక్క మొగ్గల జంటనుండి, నిరర్గల = అడ్డు లేకుండ, వినిర్గలత్ = వెలువడుచున్న, కాంతి= కాంతిచే, సుముద్రే = చక్కని ముద్రను కల్గినదానా !

**6. శ్రీవేంకటశిఖర సహమహిషీనికర కాంతలీలావసర సంగతమునినికర సముదితబహులతర భయలసదుపసార కేళిబహుమాన్యే !**

శ్రీవేంకటశిఖర = శ్రీవేంకటాచల శిఖరమందు, సహమహిషీనికర = మహిషీ సమూహముతో కూడియున్న, కాంత = నాథుని (శ్రీనివాసుని) యొక్క, లీలా+ అవసర = విలాస సమయమునందు, సంగత = వచ్చి కూడుకొనిన, మునినికర= మునిసమూహమువలన, సముదిత = జనించిన, బహులతర = మిక్కిలి గొప్పదైన, భయ = భయముచే, లసత్ = ప్రకాశించుచున్న, అపసారకేళి= తొలగుట అను క్రీడచే, బహుమాన్యే = గౌరవింపదగినదానా !

**7. శ్రీశైలాధీశ రచితదినాధీశ బింబరమాధీశ విషయతపోజన్యే !**

శ్రీశైల+ఆధీశ = శ్రీవేంకటేశ్వరునిచే, రచిత = చేయబడిన, దినాధీశబింబ= సూర్యబింబము రూపములోనున్న, రమా +అధీశవిషయ = శ్రీమన్నారాయణుని గూర్చి చేయబడిన, తపః = తపస్సువలన, జన్యే = అవతరించినదానా !

**8. శ్రీశైలాసన్న శుకపురీసంపన్న పద్మసరఉత్పన్న పద్మినీకన్యే !**

శ్రీశైల +ఆసన్న = శ్రీవేంకటాద్రికి సమీపమునన్నున్న, శుకపురీ = శుకపురి యందు, సంపన్న = ఏర్పడిన, పద్మసర = పద్మసరస్సుయందు, ఉత్పన్న = అవతరించిన, పద్మినీకన్యే = పద్మావతి అను పేరును కల కన్యకా!

**9. పద్మసరోవర్య విరచితమహాశ్చర్య ఘోరతపశ్చర్య శ్రీకమునిధుర్య కామిత వదాన్యే !**

పద్మసరోవర్య = గొప్ప పద్మసరస్సులో, విరచిత = చేయబడిన, మహా+ ఆశ్చర్య = గొప్ప ఆశ్చర్యమును కల్గించు, ఘోర = భయంకరమైన, తపశ్చర్య= తపస్సును చేయుట అను, శ్రీక = సంపదను కల, మునిధుర్య= గొప్పముని అగు శ్రీశుకునకు, కామిత వదాన్యే = కోరిన ఫలమును ఇచ్చుటలో, ఉదార స్వభావమును కల్గినదానా!

**10. మానవకర్మజాల దుర్మలమర్మనిర్మూలన లబ్ధవర్ణనిజసలిలజ వర్ణనిర్జిత దుర్వర్ణ వజ్రస్ఫటికసవర్ణ సలిలసంపూర్ణ సువర్ణముఖరీ సైకతసంజాత సంతత మకరంద బిందుసందోహనిష్యంద సందానితామందానంద మిళింద బృంద మధురతరఝుంకారరవ రుచిరసంతతసంపుల్ల మల్లీమాలతీప్రముఖ వ్రతతి వితతి కుందకురవక మరువకదమనకాది గుల్మకుసుమమహిమ ఘుమఘుమిత సర్వదిఙ్ముఖ సర్వతోముఖ మహనీయామంద మాకందావిరల నారికేళ నిరవధిక క్రముక ప్రముఖ తరునికరవీథి రమణీయ విపులతటోద్యానవిహారిణి !**

మానవకర్మజాల = మానవుల దుష్కర్మల సమూహములనెడి, దుర్మల= దుష్టమలినముయొక్క, మర్మ = రహస్యమును (మూలమును), నిర్మూలన = నిర్మూలించుటలో, లబ్ధవర్ణ = తెలివైన, (పండితులైన, సమర్థములైన), నిజసలిలజ = తన జలములనుండి పుట్టిన, వర్ణ = వన్నెచే, నిర్జిత = జయింపబడిన, దుర్వర్ణ = వెండిని, వజ్ర = వజ్రములను కల్గినది, స్ఫటిక సవర్ణసలిల = స్ఫటికమువలె శుద్ధమైన జలములతో, సంపూర్ణ = నిండినదియు అయిన, సువర్ణముఖరీ = సువర్ణముఖీనదియొక్క, సైకత = ఇసుకతిన్నెల యందు, సంజాత = పుట్టిన, సంతత = ఎల్లప్పుడు, మకరందబిందుసందోహ= తేనెబిందువుల సమూహముయొక్క, నిష్యంద = ధారలతో, సందానిత = కూడిన, అమంద = గొప్పదైన, ఆనంద = ఆనందమును కల, మిళిందబృంద= తుమ్మెదల గుంపుయొక్క, మధురతర = మిక్కిలి మధురములైన, ఝుంకారరవ = ఝుంకారధ్వనులచే, రుచిర = మనోహరములైన, సంతతసంపుల్ల = ఎల్లప్పుడు బాగుగా వికసించిన, మల్లీమాలతీప్రముఖ = మల్లె, మాలతి మొదలగువాని యొక్క, వ్రతతివితతి = సమూహముల విస్తృతిచే, కుందకురవక మరువక దమనక + ఆది = కుందము, కురవకము, మరువకము, దమనకము మొదలగు, గుల్మ కుసుమ= పూ పొదల పూలయొక్క, మహిమ = మహిమచే, ఘుమఘుమిత = ఘుమఘుమలాడు, సర్వదిక్ ముఖ = అన్ని దిక్కులను కల్గిన, సర్వతోముఖ= అంతట వ్యాపించిన, మహనీయ = గొప్పదైన, అమంద = దట్టమైన, మాకంద= తీయమామిడి చెట్లు, అవిరల = విస్తృతములైన, నారికేళ = కొబ్బరిచెట్లు, నిరవధిక = హద్దులు లేనంత విస్తృతముగా నున్న, క్రముకప్రముఖ = పోకచెట్లు మొదలైన, తరు నికరవీథి = చెట్ల గుంపుల వరుసలతో, రమణీయ = మనోహరములై, విపుల = పెద్దవి అయిన, తట = నదీతీరములలోని, ఉద్యాన= ఉద్యానములందు, విహారిణి = విహరించు స్వభావమును, కల్గినదానా !

**11. మంజులతర మణిహారిణి !**

మిక్కిలి అందమైన మణిహారములను కల్గినదానా !

**12. మహనీయతర మణిజితతరణి మకుటమనోహారిణి !**

మహనీయతర = గొప్ప వైభవమును కల (ప్రకాశమును కల), మణి = మణులచే, జిత = జయింపబడిన, తరణి = సూర్యుని కల, మకుట = కిరీటముచే, మనోహారిణి = అందమైనదానా !

**13. మంథరతర సుందరగతి మత్తమరాళయువతి సుగతి మదాపహారిణి !**

మంథరతర = మిక్కిలి మెల్లనైన, సుందర = అందమైన, గతి = గమనముచే, మత్తమరాళయువతి = మదించిన ఆడుహంసలయొక్క, సుగతి= గొప్ప నడకల, మద = గర్వమును, అపహారిణి = అపహరించినదానా !

**14. కలకంఠయువాకుంఠ కంఠనాద కలవ్యాహారిణి !**

కలకంఠయువ = యువకోకిలయొక్క, అకుంఠ = అడ్డు లేని, కంఠనాద= కంఠస్వరముకంటె, కల = మధురముగా, వ్యాహారిణి = పలుకుదానా !

**15. అకుంఠవైకుంఠ మహావిభూతి నాయకి !**

అడ్డు లేని వైకుంఠనగరములోని గొప్ప ఐశ్వర్యమునకు నాయకీ !

**16. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకి !**

కోట్లాది సకలబ్రహ్మాండములకు నాయకీ !

**17. శ్రీవేంకటనాయకి !**

శ్రీవేంకటేశ్వరుని నాయకీ !

**18. శ్రీమతి ! పద్మావతి !**

శ్రీమతీ ! పద్మావతీ !

**19. జయ ! విజయీభవ !**

సర్వోత్కర్షతో వెలుగొందుము. విజయమునొందుము.

**5. యాం లావణ్యనదీం వదంతి కవయః శ్రీమాధవాంభోనిధిం**
**గచ్ఛంతీం స్వవశంగతాంశ్చ తరసా జంతూన్ నయంతీ మపి ।**
**యస్యా మాననేత్రహస్తచరణాద్యంగాని భూషారుచీ**
**రంభోజాన్యమలోజ్జ్వలం చ సలిలం సా భాతు పద్మావతీ ॥**

యాం = ఏ పద్మావతీదేవిని, కవయః = కవులు, శ్రీమాధవాంభోనిధిం = శ్రియఃపతి అను సముద్రమును ఉద్దేశించి, గచ్ఛంతీం = వెడలుచున్నది, స్వవశంగతాన్ = తన అధీనములో నున్న (తనను ఆశ్రయించిన), జంతూన్ చ= ప్రాణులను కూడ, తరసా = వేగముగా (తనతోపాటు), నయంతీమ్ అపి = తీసుకొని వెళ్ళుచున్నది అగు, లావణ్యనదీం = లావణ్యమను నీటిని కల్గిన నదిగా, వదంతి = పల్కుచున్నారో, యస్యాం = ఏ పద్మావతి అను (లావణ్య)నదియందు, ఆనన =ముఖము, నేత్ర = నేత్రములు, హస్త = కరములు, చరణ = పాదములు, ఆది = మొదలుగా గల, అంగాని = అవయవములను, భూషారుచీః = (ఆమె) నగల కాంతులను, అంభోజాని = (వరుసగా) పద్మములుగా, అమల + ఉజ్జ్వలం = స్వచ్ఛమైన, ప్రకాశవంతమైన, సలిలం చ = నీరు అనియు, వదంతి పల్కుచున్నారో, సా = ఆ, పద్మావతీ = పద్మావతీదేవి, భాతు = ప్రకాశించుగాక!



**1. అంభోరుహవాసిని! = పద్మములో నివసించుదానా !**

**2. అంభోరుహాసన ప్రముఖాఖిల భూతానుశాసిని !**

అంభోరుహాసన ప్రముఖ = బ్రహ్మమొదలైన, అఖిలభూత = సమస్తజీవులను, అనుశాసిని = (భగవత్సంకల్పానుసారము) శాసించుదానా !

**3. అనవరతాత్మనాథ వక్షస్సింహాసనాధ్యాసిని!**

అనవరత = నిరంతరము, ఆత్మనాథ = తనకు నాథుడైన శ్రియఃపతి యొక్క, వక్షస్సింహాసన = వక్షఃస్థలమను సింహాసనములో, అధ్యాసిని = అధివసించి యుండుదానా!

**4. అంఘ్రియుగావతార పథసంతత సంగాహమాన ఘోరతరాభంగుర సంసార ఘర్మసంతప్త మనుజ సంతాపనాశిని !**

అంఘ్రియుగ = తనయొక్క పాదపద్మములనెడి, అవతారపథ = దిగి లోపలకు ప్రవేశించు దారిద్వారా, సంతత = ఎల్లప్పుడు, సంగాహమాన = పూర్తిగా అవగాహించువారై (పూర్తిగా మునిగినవారై), ఘోరతర = మిక్కిలి భయంకరమైన, అభంగుర సంసార = నిత్యమైన సంసారము యొక్క, ఘర్మ= వేడిమిచే, సంతప్త= మిక్కిలి తాపమును పొందిన, మనుజ = మానవుల, సంతాప = తాపమును, నాశిని = నశింపజేయుదానా !

**5. బహులకుంతల వదనమండల పాణిపల్లవ రుచిరలోచన సుభగకంధర బాహు వల్లికా జఘననితంబ మండలమయ వితతశైవాల సంపుల్లకమల కువలయ కంబు కమలినీ నాళోత్తుంగ విపులపులిన శోభిని !**

బహులకుంతల = దట్టమైన కేశములు, వదనమండల = ముఖమండలము, పాణిపల్లవ = చిగురుటాకువంటి చేతులు, రుచిరలోచన = ప్రకాశించు అందమైన కన్నులు, సుభగకంధర = అందమైన కంఠము, బాహువల్లికా = లతవంటి బాహువులు, జఘన నితంబ మండలమయ = నడుము పిరుదులు- అను అంగముల రూపములోనున్న, వితత = విస్తృతమైన, శైవాల = నాచు, సంపుల్లకమల= బాగుగా వికసించిన పద్మములు, కువలయ = కలువలు,

కంబు= శంఖము, కమలినీనాళ = తామరతూడులు, ఉత్తుంగ విపుల పులిన శోభిని! = ఎత్తైన విస్తృతమైన ఇసుకతిన్నెలు - అను వీనితో శోభించుదానా!

**6. మాధవ మహార్ణవ గాహిని !**

మాధవ = శ్రియఃపతి అను, మహా +అర్ణవ = గొప్ప సముద్రమునందు, అవగాహిని = అవగాహించుదానా ! (కలియుదానా)

**7. మహితలావణ్య మహావాహిని !**

మహిత = గొప్పదైన, లావణ్యా = లావణ్యమను, మహావాహిని = గొప్ప నదివంటిదానా !

**8. ముఖచంద్రసముద్యత భాలతలవిరాజమాన కించిదుదదంచిత సూక్ష్మాగ్ర కస్తూరీతిలకశూల సముద్భూతభీతి విశీర్ణసముజ్ఝిత సమ్ముఖభాగపరిసర యుగళసరభసవిస్మరర తిమిరనికర సందేహసందాయి ససీమంత కుంతలకాంతే!**

ముఖచంద్ర = చంద్రునివంటి ముఖమందు, సముద్యత = ఎత్తుగా నున్న, భాలతల = ఫాలభాగమందు, విరాజమాన = ప్రకాశించునట్టి, కించిత్ ఉదంచిత= కొంచెము పైకెత్తబడినది, సూక్ష్మ+అగ్ర = సూదిమొనను కల్గినది అగు, కస్తూరీతిలకశూల = కస్తూరీతిలకము అను శూలమువలన, సముద్భూత = జనించిన, భీతి = భయముచే, విశీర్ణ = చెదిరినవై, సముజ్ఝిత= విడచిపెట్టిన, సమ్ముఖభాగపరిసర = ముఖప్రదేశప్రాంతముయొక్క, యుగళ= జంటయందు (రెండు వైపుల), సరభస = వేగముగా, విస్మరర = వ్యాపించు, తిమిరనికర = చీకటిగుంపు అను, సందేహ = సంశయమును, సందాయి = కల్గించునట్టి, ససీమంత = పాపటతోకూడిన, కుంతల కాంతే = కేశపాశముయొక్క కాంతిని కల్గినదానా!

**9. స్ఫటికమణిమయ కందర్పదర్పణ సందేహసందోహి సకలజనసమ్మోహి ఫలఫలవిమల లావణ్యలలిత సతతముదిత ముదితముఖ మండలే !**

స్ఫటికమణిమయ = స్ఫటికమణులతో నిర్మింపబడిన, కందర్పదర్పణ= మన్మథుని దర్పణమా? అను, సందేహ సందోహి = సందేహమును కల్గించునది, సకలజన = సమస్తజనములను, సమ్మోహి = సమ్మోహమును కల్గించునది,



ఫలఫల విమల = ఫళఫళమని ప్రకాశించు, స్వచ్ఛమైన, లావణ్యా = లావణ్యముచే, లలిత = అందమైనది, సతత= ఎల్లప్పుడు, ముత్+ఇత = సంతోషమును పొందినది, (కావుననే) ముదిత = వికసించినది అగు, ముఖమండలే = గుండ్రని ముఖమును కల్గినదానా !

**10. మహితమ్రదిమ మహిమమందహాసాసహిష్ణు తదుదయ సముదిత క్లమోదీర్ణారుణవర్ణ విభ్రమదవిడంబిత పరిణత బింబవిద్రుమ విలసదోష్ఠయుగళే !**

మహిత = గొప్పదైన, మ్రదిమ = సౌకుమార్యముయొక్క, మహిమ = గొప్పతనమువలన, మందహాస+అసహిష్ణు = చిఱునవ్వును సైతము సహింపలేనిదగుటచే, తత్+ఉదయ = ఆ చిఱునవ్వుయొక్క ఉదయముచే, సముదిత = పుట్టిన, క్లమ= శ్రమవలన, ఉదీర్ణ = అతిశయించిన, అరుణవర్ణ= ఎఱ్ఱదనముతో, విభ్రమద = సందేహమును కల్గించునవి, విడంబిత = అనుకరింపబడినవి, అనగా- సాటివచ్చునవి అగు, పరిణత = పండిన, బింబ= దొండపండు, విద్రుమ = పగడములను కల్గినవై, విలసత్ = ప్రకాశించు, ఓష్ఠయుగళే = క్రిందిపెదవిని, పైపెదవిని కలదానా !

**11. పరిహసిత దరహసిత కోకనద కుందరద మంథరతరోద్గత్వర విసృత్వర కాంతివీచి కమనీయామంద మందహాస సదనవదనే !**

పరిహసిత = పరిహసింపబడిన (గేలి చేయబడిన), దరహసిత = కొంచెము వికసించిన, కోకనద = ఎఱ్ఱకలువను, కుంద = కుందపుష్పమును కల, రద = దంతములనుండి, మంథరతర = మిక్కిలి మెల్లగా, ఉద్గత్వర = పైకి ప్రసరించి, విసృత్వర = అంతట విస్తరించు స్వభావమును కల, కాంతి = కాంతియొక్క, వీచి =కెఱటములచే, కమనీయ = అందమైన, అమంద మందహాస = స్పష్టమైన చిఱునవ్వునకు, సదన = నివాసమైన, వదనే = వదనమును కల్గినదానా !

**12. సముజ్జ్వలతర మణితర్జిత తరణితాటంక నిరాటంకకందలిత కాంతిపూర కరంబిత కర్ణశష్కులీవలయే !**

సముజ్జ్వలతర = మిక్కిలిగా ప్రకాశించు, మణి = రత్నములచే, తర్జిత= భయపెట్టబడిన, తరణి = సూర్యుని కల, తాటంక = తాటంకములు (దుద్దులు) అను కర్ణభూషణముల నుండి, నిరాటంక = అడ్డు లేకుండ, కందలిత =

దీపకళికలై పుట్టిన, కాంతిపూర = కాంతిప్రవాహములచే, కరంబిత = కూడుకొనిన, కర్ణశష్కులీవలయే = శష్కులములవంటి (చక్కిలములవంటి) గుండ్రని కర్ణ రంధ్రములను కల్గినదానా!

**13. బహిరుపగత స్ఫురణాధిగతాంతరంగణ భూషణగణ వదనకోశసదన స్ఫటిక మణిమయభిత్తి శంకాంకురణ చణప్రతిఫలితకర్ణపూర కర్ణావతం సతాటంక కుండలమండన నిగనిగాయమాన విమలకపోలమండలే !**

బహిః ఉపగత = బయటకు వచ్చిన, స్ఫురణ = కాంతులచే, అధిగత = తెలియబడిన, అంతః+అంగణ = లోపలి భాగములోని, భూషణగణ = నగల సమూహములను కల, వదన = ముఖము అనెడి, కోశసదన = కోశాగారము యొక్క, స్ఫటికమణిమయ = స్ఫటికమణులతో నిర్మించిన, భిత్తి = గోడలు అను, శంకా = సందేహము, అంకురణ = కల్గుటలో, చణ = సమర్థమై, ప్రతిఫలిత = ప్రతిఫలించిన, కర్ణపూర = కర్ణపూరములు (వలయాకారములోని కర్ణాభరణ ములు), కర్ణ +అవతంస = కర్ణావతంసములు (చెవులపైభాగములోని ఆభరణములు - చెంపసరములవంటివి), తాటంక = తాటంకములు (దుద్దులు), కుండల = కుండలములు అను, మండన = అలంకారములచే, నిగనిగాయమాన= నిగనిగమని వెల్గుచున్న, విమల = స్వచ్ఛములైన, కపోలమండలే = గుండ్రని కపోలములను కల్గినదానా !

**14. నిజభ్రుకుటీభటీభూత త్ర్యక్షాష్టాక్షద్వాదశాక్ష సహస్రాక్షప్రభృతి సర్వసుపర్వ శోభన భ్రూమండలే !**

నిజభ్రుకుటీ = తన కనుబొమల ముడికి, భటీభూత = భటులైన, త్ర్యక్ష= పరమేశ్వరుడు, అష్టాక్ష = చతుర్ముఖుడు, ద్వాదశాక్ష = షణ్ముఖుడు, సహస్రాక్ష= దేవేంద్రుడు, ప్రభృతి = మొదలగు, సర్వ = అందఱు, సుపర్వ = దేవతలను కల, శోభన = అందమైన, భ్రూమండలే = భ్రూమండలములను కల్గినదానా! (కనుబొమలను కలదానా)

**15. నిటలఫలక మృగమదతిలకచ్ఛల విలోకలోకవిలోచన దోషవిరచిత విదళన వదనవిధుమండల విగలితనాసికాప్రణాళికా నిగూఢనిఃసృత నాసాగ్రస్థూల ముక్తా ఫలచ్ఛలాభివ్యక్త వదనబిలనిలీన కంఠనాళికాంతఃప్రవృత్త గ్రీవామధ్యోచ్చ భాగకృత విభాగగ్రీవాగర్తవినిఃసృత పృథులవిలసదురోజ శైలయుగళ నిర్ఝరజర్ఝరీ**



**భూత గంభీరనాభిహ్రదావగాఢ నిలీనదీర్ఘతర పృథులసుధాధారా ప్రవాహయుగళ విభ్రమాధార విస్పష్టవీక్ష్యమాణ విశుద్ధస్థూలముక్తాఫలమాలా విద్యోతిత దిగంతరే!**

నిటలఫలక = ఫలకమువంటి ఫాలమునందు, మృగమదతిలకచ్ఛల = కస్తూరీతిలకము అను మిషచే, విలోకలోక = ప్రేక్షకజనుల, లోచనదోష = దృష్టిదోషము కారణముచే, విరచిత = రచింపబడిన (చేయబడిన), విదళన = పగులును కల, వదనవిధుమండల = ముఖమను చంద్రమండలమునుండి, విగలిత = స్రవించినది, నాసికాప్రణాళికా = నాసిక అను కాలువద్వారా, నిగూఢ= మిక్కిలి గూఢముగా, నిఃసృత = బయటకు వచ్చినది, నాసా+అగ్ర = నాసిక చివరగల, స్థూలముక్తాఫలచ్ఛల = దిటవు అయిన ముత్యము అను నెపమున, అభివ్యక్త = బయటకు వ్యక్తమైనది, వదనబిల = నోరు అను బిలమునందు, నిలీన = లోపల అణగినదై, కంఠ+నాళికా అంతఃప్రవృత్త = కంఠనాళికలోపల ప్రసరించినదై. గ్రీవామధ్య+ఉచ్చ భాగకృతవిభాగ = కంఠమధ్యమునందు ఉన్నత ప్రదేశమున విభాగింపబడినదై, గ్రీవా గర్త వినిఃసృత్ = కంఠమను గుంటనుండి బయటకు వచ్చినది. పృథుల = పెద్దవై, విలసత్ = ప్రకాశించు, ఉరోజ శైలయు గల = స్తనములనెడి రెండు పర్వతములలోని, నిర్ఝరజర్ఝరీ = కొండవాగుల ప్రవాహ ములవలెనున్నది, గంభీరనాభిహ్రద = లోతైన నాభి అను చెఱువులో, అవగాఢనిలీన = మిక్కిలి గాఢముగా అణగియున్నది, దీర్ఘతర = మిక్కిలి పొడుగైన, పృథుల = విస్తృతమైన, సుధాధారా = అమృతధారయొక్క, ప్రవాహయుగళ = ప్రవాహద్వయము అనెడి, విభ్రమ+ఆధార = గొప్ప భ్రమకు ఆధారమై, విస్పష్ట వీక్ష్యమాణ = మిక్కిలి స్పష్టముగా చూడబడుచున్న, విశుద్ధ= మిక్కిలి స్వచ్ఛమైన, స్థూల = పెద్దదైన, ముక్తాఫల = ముత్యముల (చేకూర్చబడిన), మాలా = మాలికచే, విద్యోతిత = గొప్పగా ప్రకాశింప చేయబడిన, దిగంతరే = దిక్కుల మధ్యభాగమును కల్గినదానా!

**16. సకలాభరణ కలావిలాసకృత జంగమచిరస్థాయి సౌదామనీశంకాంకురే !**

సకల+ఆభరణ = సమస్తభూషణములయొక్క, కళావిలాస = కాంతి విలాసముచేతనే, కృత = కల్పింపబడినది, జంగమ = కదలునట్టిది, చిరస్థాయి= చిరకాలము ఉండునది అగు, సౌదామనీ = మెఱపుతీగయా? అను, శంకా = సందేహముయొక్క, అంకురే = అంకురమును (కారణమును) కల్గినదానా !

**17. కనకరశనా కింకిణీ కలనాదిని !**

కనకరశనా = బంగారు మొలనూలులోని, కింకిణీ = మువ్వలయొక్క, కల= మనోహరమైన, నాదిని = నాదమును కల్గినదానా !

**18. నిజజనతాగుణ నిజపతినికట నివేదిని !**

నిజ=తనయొక్క, జనతా = ఆశ్రిత జనసమూహముయొక్క, గుణ = గుణములను, నిజ పతినికట = తన భర్తసమీపమునందు, నివేదిని = నివేదించు దానా!

**19. నిఖిలజనానుమోదిని !**

సమస్తజనులను అంగీకరించి అనుగ్రహించుదానా !

**20. నిజపతిసమ్మోదిని !**

తన భర్తను ఆనందపఱచుదానా !

**21. మంథరతరమేహి**

మంథరతరం = మిక్కిలి మెల్లగా, ఏహి = రమ్ము.

**22. మంద మిమ మవేహి**

మందం = మందునిగా, ఇమం = ఇతనిని (నన్ను), అవేహి = గ్రహింపుము.

**23. మయి మన ఆధేహి**

మయి = నాయందు, మనః = మనస్సును, ఆధేహి = కల్గింపుము

**24. మమ శుభ మవధేహి**

మమ= నాకు, శుభం = మంచిని, అవధేహి = అవధరింపుము.

**25. మంగళమయి! భాహి**

మంగళమయి! = మంగళస్వరూపిణీ !, భాహి = ప్రకాశింపుము.

**26. అకుంఠవైకుంఠ మహావిభూతినాయకి !**

అకుంఠవైకుంఠమహావిభూతి = అడ్డు లేని, వైకుంఠలోకవిభూతికి, నాయకి= నాయకురాలా !

**27. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకి !**

సమస్త బ్రహ్మాండములకు నాయకీ !



**28. శ్రీవేంకటనాయకి !**

శ్రీవేంకటాచలనాయకీ !

**29. శ్రీమతి ! పద్మావతి !**

శ్రీమతి ! పద్మావతీ !

**30. జయ ! విజయీభవ !**

సర్వోత్కర్షతో వెలుగొందుము! విజయము నొందుము.

**6. జీయాచ్ఛ్రీవేంకటాద్రిప్రభువరమహిషీ నామ పద్మావతీ శ్రీః**
**జీయాచ్చాస్యాః కటాక్షామృతరసరసికో వేంకటాద్రే రధీశః ।**
**జీయా చ్ఛ్రీవైష్ణవాళీ హతకుమతికథా వీక్షణై రేతదీయైః**
**జీయాచ్చ శ్రీశుకర్షేః పుర మనవరతం సర్వసంపత్సమృద్ధమ్ ॥**

శ్రీవేంకటాద్రిప్రభువరమహిషీ = శ్రీవేంకటేశ్వరుని పట్టపురాణి, పద్మావతీ నామ = పద్మావతీ అను పేరుతో ప్రసిద్ధియైన, శ్రీః = లక్ష్మీదేవి, జీయాత్ = వర్ధిల్లునుగాక !, అస్యాః =ఈమెయొక్క, కటాక్ష+అమృతరసరసికః = క్రీగంటి చూపులనే అమృతరసముతో ఆనందించువాడైన, వేంకటాద్రేః అధీశః చ = వేంకటాచలపతియును, జీయాత్ = వర్ధిల్లునుగాక ! ఏతదీయైః = వీరిద్దరి యొక్క, వీక్షణైః = కటాక్షములచే, హతకుమతికథా = నశించిన దుర్వాదములను కల్గిన (దుర్వాదములను చేయు కుమతులను జయించినవారైన), వైష్ణవాళీ = శ్రీవైష్ణవ సమూహము, జీయాత్ = వర్ధిల్లునుగాక!, శ్రీశుకర్షేః = శ్రీ శుకమహర్షియొక్క, ఏతత్ పురం చ = ఈ పురముకూడ, అనవరతం = ఎల్లప్పుడు, సర్వసంపత్ సమృద్ధం = సకల సంపదలతో నిండినదై, జీయాత్ = వర్ధిల్లునుగాక!

**7. శ్రీరంగసూరిణేదం శ్రీశైలానంతసూరివంశ్యేన ।**
**భక్త్యా రచితం గద్యం లక్ష్మీః పద్మావతీ సమాదత్తామ్ ॥**

శ్రీశైలానంతసూరివంశ్యేన = తిరుమలై అనంతార్యుల వంశమునకు చెందిన, శ్రీరంగసూరిణా = శ్రీరంగాచార్యులవారిచే, భక్త్యా = భక్తితో, రచితమ్ = రచింపబడిన, ఇదం = ఈ, గద్యం = గద్యమును, పద్మావతీ = పద్మావతి అనబడు, లక్ష్మీః =లక్ష్మీదేవి, సమాదత్తామ్ = గైకొనుగాక !

చతుఃశాస్త్రమహావిద్వాన్, ఉ.వే. శ్రీమాన్ అనన్తాణ్‌పిళ్ళై
పురిశై శ్రీరంగాచార్యస్వామి విద్వద్వరేణ్యులచే విరచితమైన

# శ్రీనివాసగద్యమ్

**శ్రీవేంకటాద్రి నిలయః కమలాకాముకః పుమాన్ ।**
**అభంగురవిభూతి ర్నస్తరంగయతు మంగళమ్ ॥**

లక్ష్మికి వల్లభుడు. నిత్యమైన విభూతిని కలవాడు, పరమపురుషుడైన వేంకటేశ్వరుడు మనకు శుభపరంపరలను అనుగ్రహించుగాక!

**1. శ్రీమదఖిలమహీమండలమండనధరణిధరమండలాఖండలస్య,**

శ్రీమత్ = శోభను, సంపత్తును కల్గిన, అఖిల = సమస్తమైన, మహీ మండల= భూమండలమునకు, మండన = అలంకారమైనది, ధరణిధర మండల + అఖండలస్య= పర్వతసమూహములలో ఇంద్రునివంటిది. (గొప్పది).

**2. నిఖిలసురాసురవందితవరాహక్షేత్రవిభూషణస్య,**

నిఖిల = సకల, సుర+అసుర = దేవతలచే, రాక్షసలచే, వందిత = నమస్కరింప బడినది, వరాహక్షేత్ర = వరాహక్షేత్రమునకు, విభూషణస్య = గొప్ప అలంకారమైనది.

**3. శేషాచలగరుడాచల వృషభాచలనారాయణాచలాంజనాచలాది శిఖరి మాలాకులస్య,**

శేషాచల = శేషాచలము, గరుడాచల = గరుడాచలము, వృషభాచల = వృషభా చలము, నారాయణాచల = నారాయణాచలము, అంజనాచల = అంజనాచలము, అది = అను మొదలగు, శిఖరిమాలా = పర్వతపంక్తులతో, ఆకులస్య = నిండినది.

**4. నాథముఖబోధనిధివీథిగుణసాభరణసత్త్వనిధితత్త్వనిధిభక్తిగుణపూర్ణ శ్రీశైలపూర్ణ గుణవశంవద పరమపురుషకృపాపూరవిభ్రమదతుంగశృంగ గలద్గగనగంగా సమాలింగితస్య,**

నాథముఖ = నాథముని మొదలగు, బోధనిధి = జ్ఞాననిధులగు ఆచార్యుల, వీథి= వరుసయందు, గుణసాభరణ = సద్గుణములనెడి ఆభరణములను కల్గినవారు, సత్త్వనిధి = సత్త్వగుణమునకు నిధి, తత్త్వనిధి = తత్త్వజ్ఞానమునకు నిధి, భక్తిగుణపూర్ణ= భక్తితో గుణములతో పూర్ణులగు, శ్రీశైలపూర్ణ = శ్రీశైలపూర్ణులను ఆచార్యునియొక్క, గుణ = సద్గుణములకు, వశంవద = వశుడైన, పరమపురుష = పురుషోత్తముడగు వేంకటేశ్వరునియొక్క, కృపాపూర= దయాప్రవాహమేమో? అను, విభ్రమద = భ్రమను కల్గించునది, తుంగశృంగ= ఎత్తైన పర్వతశిఖరమునుండి, గలత్ = ప్రవహించునది అగు, గగనగంగా = ఆకాశగంగానదిచే, సమాలింగితస్య = కూడియున్నది.



**5. సీమాతిగగుణరామానుజమునినామాంకిత బహుభూమాశ్రయ సురధామా లయ వనరామాయతవనసీమాపరివృతవిశంకటతటనిరంతర విజృంభితభక్తిరస నిర్ఘురా నంతార్యాహార్యప్రస్రవణ ధారాపూరవిభ్రమద సలిలభర భరితమహా తటాకమండితస్య,**

సీమాతిగ = అవధిని దాటిన, గుణ = గుణములను కల, రామానుజ ముని= భగవద్రామానుజమునుల, నామ = పేరుతో, అంకిత = అంకితమైనది, బహు భూమా+ఆశ్రయ = గొప్ప మహిమకు ఆశ్రయమైనది, సురధామ + ఆలయ= దేవతల నివాసములకు నిలయమైన స్వర్గములోని, వన = నందనవనము కంటె, రామ = మనోహరమైన, ఆయత = విస్తృతమైన, వనసీమా = వనసీమచే, పరివృత = చుట్టబడినది, విశంకట = గొప్పదైన, తట = తీరమును కల్గినది, నిరంతర = ఎల్లప్పుడు, విజృంభిత = మిక్కిలి పెంపొందిన, భక్తిరస= భక్తి అను రసముయొక్క, నిర్ఘుర = జలపాతమైనది, అనంతార్య + ఆహార్య= తీసికొని రాదగినది, ప్రస్రవణ = ప్రవాహము యొక్క, ధారాపూర = కొండవాగుల యొక్క, విభ్రమద = భ్రమను కల్గించు, సలిలభర= నీటి పౌష్కల్యముచే, భరిత= నిండిన, మహాతటాకమండితస్య = గొప్ప తటాకముతో భూషింపబడినది (అలంకరింపబడినది).

**6. కలికర్దమమలమర్దనకలితోద్యమవిలసద్యమనియమాదిమమునిగణ నిషేవ్య మాణ ప్రత్యక్షీభవన్నిజసలిల సమజ్జనమజ్జననిఖిల పాపనాశనపాపనాశన తీర్థాధ్యాసితస్య,**

కలికర్దమ = కలిదోషమనెడి (పాపమును) మల = మలినమును, మర్దన= మర్దించుటకై (తొలగించుటకై), కలిత = చేయబడిన, ఉద్యమ = ప్రయత్నమును కల్గినవి, విలసత్ = ప్రకాశించు, యమనియమ = యమము, నియమము, ఆదిమ= మొదలగువానిని కల్గినవి అగు, మునిగణ = ఋషిగణములచే,

నిషేవ్యమాణ= సేవింపబడుచున్నది, ప్రత్యక్షీభవత్ = ప్రత్యక్షమగుచున్న (స్పష్టముగా ఆచరించు), నిజసలిల = తన జలమునందు, సమజ్జన = స్నాన పూర్వకముగా (స్నానము చేసిన తర్వాత) నమత్ = నమస్కరించు, జన = జనుల, నిఖిల = సమస్త, పాప = పాపములను, నాశన = నాశనమును కల్గినది, పాపనాశన = పాపనాశనమను, తీర్థ=తీర్థముచే, అధ్యాసితస్య = అధిష్ఠింపబడినది.

**7. మురారిసేవక జరాధిపీడిత నిరార్తిజీవన నిరాశభూసుర వరాతిసుందర సురాంగనా రతికరాంగ సౌష్ఠవకుమారతాకృతి కుమారతారక సమాపనోదయ దమానపాతక మహాపదామయవిహాపనోదిత సకలభువనవిదిత కుమార ధారాభిధాన తీర్థాధిష్ఠితస్య,**

మురారిసేవక = భగవానుని సేవకుడై, జరా = ముసలితనము అను, అధి= వ్యాధులచే, పీడిత = పీడితుడై, నిరార్తి = మిక్కిలి ఆర్తిచే, జీవననిరాశ = జీవితమందు నిరాశను కల, భూసురవర = బ్రాహ్మణశ్రేష్ఠునకు, అతిసుందర= మిక్కిలి అందమైన, సురాంగనా = అప్సరసలకు కూడ, రతికర = మోహమును కల్గించు, అంగసౌష్ఠవ= అందమైన అంగములను కల, కుమారతాకృతి = యౌవన రూపము కల్గించుటచేత, కుమార = కుమారస్వామికి, తారకసమాపన= తారకాసురుని వధించుటచే, ఉదయత్= పుట్టుచున్న, అమానపాతక = అంతు లేని పాతకమువల్ల కల్గిన మహాపదామయ = గొప్ప ఆపద అను (మానసిక) వ్యాధిని, విహాపన = పోగొట్టుట చేత, ఉదిత = జనించిన, సకల భువన విదిత= అన్నిలోకాలలో ఖ్యాతి చెందిన, కుమారధారా = కుమారధార అను, అభిధాన = పేరును కల, తీర్థ = పుణ్యతీర్థముచే, అధిష్ఠితస్య= అధిష్ఠింపబడినది.

**8. ధరణితలగత సకలహత కలిలశుభ సలిలగత బహులవివిధ మలహతి చతుర రుచిరతరవిలోకమాత్రవిదళితవివిధమహాపాతక స్వామిపుష్కరిణీ సమేతస్య,**

ధరణితలగత = భూతలమందున్న, సకల = సమస్తములైన, హతకలిల= పవిత్రమైన (దోషము లేని), శుభసలిలగత = పుణ్యజలములయందున్న, బహు వివిధ= అనేకములైన, వివిధములైన, మల = పాతకములయొక్క, హతి= నాశనమందు, చతుర= చాతుర్యమును కల్గినది, రుచిరతర = మిక్కిలి ప్రకాశ వంతమైనది, (తీయనైనది) విలోకనమాత్ర = చూచుటతోనే, విదళిత = బ్రద్ధలు చేయబడిన, వివిధ = అనేకములైన, మహాపాతక = మహాపాతకములను



కల్గినదగు, (దర్శన మాత్రంతోనే పాపాలను తీర్చేది) స్వామిపుష్కరిణీ = స్వామి పుష్కరిణీ తీర్థముచే, సమేతస్య = కూడుకొన్నది.

**9. బహుసంకట నరకావట పతదుత్కట కలికంకట కలుషోద్భట జనపాతక వినిపాతక రుచినాటక కరహాటక కలశాహృత కమలారత శుభమజ్జన జలసజ్జన భరిత నిజదురిత హతినిరత జనసతత నిరర్గళపేపీయమాన సలిలసంభృత విశంకట కటాహతీర్థవిభూషితస్య,**

బహుసంకట = పలు సంకటాలతో కూడుకొన్న, నరక అవట = నరక కూపాలలో, పతత్ = పడుతున్నవారు, ఉత్కట కలికంకట = పూర్ణమైన కవచాలుగా కలవారు, కలుష ఉద్భట = దోషాలలో గొప్పవారైన, జన = పాపాత్ముల, పాతక= తీవ్రపాపాలను, వినిపాతక రుచినాటకకర = నశింపజేసే గొప్పలీలను చేసేది (అవలీలగా నశింపజేసేది), హాటక కలశాహృత = బంగారు కలశాలతో తీసికొని రాబడినవి, కమలారతశుభమజ్జన = శ్రీవేంకటేశ్వరుని మంగళ స్నానం కోసమైన జలములను కల, సజ్జనభరిత = సజ్జనులతో నిండినది, నిజదురితహతి= తమ పాపాలను పోగొట్టుకోవడంలో, నిరత = ఆసక్తులైన, జన = జనులచేత, సతత = ఎల్లప్పుడు, నిరర్గళపేపీయమాన = అడ్డులేకుండా మిక్కిలిగా పానం చేయబడే, సలిలసంభృత = నీటితో నిండినది, విశంకట = గొప్పది అయిన, కటాహతీర్థ = కటాహతీర్థంతో, విభూషితస్య = గొప్పగా భూషింపబడినది.

**10. ఏవమాదిమ భూరిమంజిమ సర్వపాతక గర్వహాపక సింధుడంబర హారిశంబర వివిధవిపుల పుణ్యతీర్థనివహనివాసస్య,**

ఏవమ్ ఆదిమ = ఇటువంటివి, భూరిమంజిమ = మిక్కిలి అందమైనవి, సర్వపాతక = అన్ని పాపములయొక్క, గర్వ =గర్వమును, హాపక = పోగొట్టునవి, సింధుడంబరహారి = సముద్రముయొక్క గర్వమును హరించు, శంబర = నీటిని కల్గినవి అగు, వివిధ = అనేకములైన, విపుల = విస్తృతములైన, పుణ్యతీర్థ= పుణ్య తీర్థముల యొక్క, నివహ = సమూహమునకు, నివాసస్య = నివాసమైనది అగు.

**11. శ్రీమతో వేంకటాచలస్య**

అందమైన గొప్పదైన వేంకటాచలముయొక్క – అని అర్థం.

**12. శిఖరశేఖరమహాకల్పశాఖీ,**

శిఖరశేఖర = గొప్ప శిఖరమునకు అలంకారమగు, మహాకల్పశాఖీ = గొప్ప కల్పవృక్షమువంటివాడు.

**13. ఖర్వీభవదతిగర్వీకృతగురుమేర్వీశగిరిముఖోర్వీధరకులదర్వీకర దయితోర్వీ ధరశిఖరోర్వీసతతసదుర్వీకృతిచణనవఘనగర్వచర్వణనిపుణ తనుకిరణ మసృణిత గిరిశిఖరశేఖర తరునికరతిమిరః,**

ఖర్వీభవత్ = తక్కువగా (పొట్టివిగా) అగుచున్న, అతిగర్వీకృత = మిక్కిలిగా గర్వించిన, గురు = గొప్పవైన, మేరు = మేరుపర్వతము, ఈశగిరి= కైలాసపర్వతము, ముఖ = మొదలగు, ఉర్వీధరకుల = పర్వతసమూహమును కల, దర్వీకరద యిత+ఉర్వీధర = శేషాచలముయొక్క, శిఖర = శిఖరములలోని, ఉర్వీ = భూమి యందు, సతత = ఎల్లప్పుడు, సదూర్వీకృతి = గొప్పగా విస్తరించుటలో, చణ = సమర్థమైనది, నవఘన = నూతన (నల్లని) మేఘము యొక్క, గర్వ = అతిశయమును, చర్వణ = అనుభవించుటలో, నిపుణ= సమర్థమైనదగు, తను= దివ్యమంగళ విగ్రహము యొక్క, కిరణ = కాంతికిరణములతో, మసృణిత = మఱింత చిక్కగా చేయబడిన, గిరిశిఖరశేఖర = శేషాచలమందలి గొప్ప శిఖరముపై గల, తరునికర = వృక్షసమూహముచే ఏర్పడిన, తిమిరః = కాంతిని కలవాడు.

**14. వాణీపతి శర్వాణీదయితేంద్రాణీశ్వరముఖనాణీయోరసవేణీనిభ శుభవాణీ నుతమహిమాణీయస్తరకోణీ భవదఖిలభువన భవనోదరః ।**

వాణీపతి = బ్రహ్మ, శర్వాణీదయిత = శివుడు, ఇంద్రాణీశ్వర = ఇంద్రుడు, ముఖ = మొదలగువారి, నాణీయోరసవేణీనిభ = గొప్పవి అయిన రసప్రవాహ ముల వంటి, శుభవాణీ = మంగళవాక్కులతో, నుత = స్తుతింపబడిన, మహిమా = మహిమ యందలి (కల్గినది), అణీయస్తరకోణీభవత్ = అతిచిన్న భాగమందు ఏదో ఒక మూల అణగుచున్న, అఖిలభువన భవన = సమస్తభువనములకు స్థానమైనది అయిన, ఉదరః= ఉదరమును కలవాడు.

**15. వైమానికగురుభూమాధికగుణ రామానుజకృతధామాకరకరధామారిదర లలా మాచ్ఛకనకదామాయిత నిజరామాలయనవకిసలయమయతోరణ మాలాయితవన మాలాధరః,**

వైమానికగురు = దేవతలకు గురువైన బృహస్పతియొక్క, భూమ+అధిక గుణ= బుద్ధివైభవముకంటే పలు రెట్లు అధికమైన బుద్ధివైభవమును కల్గినవారైన, రామానుజ కృత= భగవద్రామానుజులచే సమర్పింపబడిన, ధామ+ఆకర =తేజస్సుకు



నిలయమైన, కర = శ్రీహస్తాలను, ధామ = నిలయంగా – ఆశ్రయంగా కల్గినవి అగు, అరిదరలలామ= గొప్ప శ్రీసుదర్శనానికి, పాంచజన్యానికి, అచ్ఛకనక దామాయిత = (అలంకారమైన) స్వచ్ఛమైన బంగారుపూల మాల వంటిది, నిజ రామా = తన ప్రేయసి అయిన లక్ష్మిదేవికి, ఆలయ = గృహమైన తన వక్షస్సుకు, నవకిసలయమయ = కొత్తవి అయిన చిగుళ్ళతో చేయబడిన, తోరణ మాలాయిత= ద్వారబంధ మాలికవంటిది అగు, వనమాలాధరః = వనమాలను ధరించినవాడు.

**16. కాలాంబుదమాలానిభనీలాలకజాలావృతబాలాబ్జసలీలామలఫాలాంక సమూలా మృతధారాద్వయావధీరణధీరలలితతరవిశదతర ఘనఘనసారమ యోర్ధ్వపుండ్ర రేఖాద్వయరుచిరః,**

కాలాంబుదమాలా = నల్లని మేఘమాలతో, నిభ = పోలిన, నీల = అలక జాల = నల్లని ముంగురుల సమూహంతో, అవృత = ఆవరింపబడినది, బాల+ అబ్జసలీల = బాలచంద్రునివంటిది, అమల =స్వచ్ఛమైనది అయిన, ఫాలాంక = ఫాలభాగముయొక్క అంకమును, సమూల = మూలముగ కూడినవై, (మూలమును కల్గినవై), అమృత ధారాద్వయ = అమృతధారలను రెండిటిని, అవధీరణ = హేళన చేయుటయందు, ధీర = ధైర్యమును కల్గినది, లలితతర= మిక్కిలి అందమైనవి, విశదతర = మిక్కిలి స్పష్టమైనవి, ఘన = గొప్పవి, ఘనసారమయ = పచ్చ కర్పూరముతో దిద్దబడినవి అగు, ఊర్ధ్వపుండ్ర రేఖాద్వయ= ఊర్ధ్వపుండ్రరేఖలు రెండిటితో, రుచిరః = ఆకర్షణీయ మైనవాడు. (ప్రకాశించేవాడు)

**17. సువికస్వర దళభాస్వర కమలోదర గతమేదుర నవకేసర తతిభాసుర పరిపింజర కలితాంబర కలితాదర లలితోదర తదాలంబజంభ రిపుమణిస్తంభ గంభీరిమదంభ స్తంభన సముజ్జృంభమాణ పీవరోరుయుగళ తదాలంబ పృథులకదళీ ముకుళ మదహరణ జంఘాలజంఘాయుగళః,**

సువికస్వర = బాగుగా వికసించిన, దళ = రేకులతో, భాస్వర = ప్రకాశించు, కమల = పద్మముయొక్క, ఉదరగత = గర్భమున గల, మేదుర = దట్టమైన, నవ = క్రొత్తవైన, కేసర = కింజల్కముల, తతి = సమూహమువలె, భాసుర = ప్రకాశవంతమైన, పరిపింజర =అంతట పింజరవర్ణమును కల్గినదిగా (ఎఱుపు– పసుపుల కలయికను కల–స్వర్ణవర్ణము), కనకాంబర = స్వర్ణాంబరమునందు (బంగారు వస్త్రముపట్లు), కలిత+ఆదర = ఆదరమును కల్గినదగు, లలిత+ఉదర= అందమైన (సుకుమారమైన) ఉదరమును, తదాలంబ = దానిని ఆధారముగా

కల్గిన, జంభరిపుమణిస్తంభ = ఇంద్రమణులు పొదిగిన స్తంభముల, గంభీరిమ= గాంభీర్యమును, దంభ = గర్వమును, స్తంభన = స్తంభింపచేయుట చేత, సముజ్జృంభమాణ = మిక్కిలి వర్ధిల్లుచున్న, పీవర= బలమైన, ఊరు యుగళ= ఊరుద్వయమును, తదాలంబ = ఆ ఊరువులను ఆధారముగా కల, పృథుల= పెద్దవైన, కదళీముకుల = అరటి మొగ్గల, మదహరణ= మదమును హరించుట యందు, జంఘాల = గొప్ప వేగముగా పరుగు తీయగల, జంఘాయుగళః = పిక్కలను రెండిటిని కలవాడు.

**18. నవ్యదళ భవ్యకల పీతమల శోణిమల సన్మృదుల సత్కిసలయాశ్రుజలకారి బలశోణతల పత్కమలనిజాశ్రయ బలబందీకృతశరదిందుమండలీ విభ్రమదాదభ్రశుభ్ర పునర్భవాధిష్ఠితాంగులీ గాఢనిపీడిత పద్మాసనః,**

నవ్య = నూతనములైన, దళ = దళములచే, భవ్య = మంగళకరమైనది, కల = అందమైనది, పీతమల = త్రాగబడిన మలినము గల (నిర్మలమైన), దోషరహితమయిన, శోణిమ = ఎఱ్ఱని రంగుచే, లసత్ = ప్రకాశించు, మృదుల= సున్నితమైన, కిసలయ = చిగురుటాకునకు, అశ్రుజలకారి = కన్నీళ్ళను కలుగచేయు (చిగురుటాకును మించిన), బల = బలమును కల, శోణతల = ఎఱ్ఱని క్రింది భాగమును కల, పత్ = శ్రీపాదములనెడి, కమల = కమలము అను, నిజ+ ఆశ్రయ = తన ఆశ్రయముయొక్క, బల= బలముచే, బందీకృత= బందీచేయబడివి అగు, శరత్+ఇందుమండలీ = శరత్కాల చంద్రమండలి యొక్క, విభ్రమద = భ్రమను కల్గించునవి, అదభ్రశుభ్ర = తక్కువ కాని (అనల్పములైన) శుభ్రములైన, పునర్భవ = గోళ్ళతో, అధిష్ఠిత = అధిష్ఠింపబడిన, అంగులీ =కాలివేళ్లచే, గాఢనిపీడిత = గాఢముగా పీడింపబడిన, పద్మ+ఆసనః = ఆసన పద్మమును కలవాడు.

**19. జానుతలావధిలంబివిడంబిత వారణశుండా దండవిజృంభిత నీలమణి మయ కల్పకశాఖా విభ్రమదాయి మృణాళలతాయిత సముజ్జ్వలతర కనక వలయ వేల్లితైకతర బాహుదండయుగళః,**

జానుతల+అవధిలంబి = మోకాళ్ళవరకు వేలాడేవి (విస్తరించినవి), విడంబిత= అనుకరింపబడిన, వారణశుండాదండ = ఏనుగు తొండమును కల్గినది, విజృంభిత= గొప్పగా వృద్ధి చెందిన, నీలమణిమయ = నీలమణులతో కూడిన, కల్పకశాఖా = కల్పవృక్షశాఖయొక్క, విభ్రమ = భ్రమను, దాయి = కల్గించునది, మృణాలలతాయిత= నాచుతీగవలెనున్న, సముజ్జ్వలతర = మిక్కిలిగా వెలుగొందు,



కనకవలయవల్లీ = లతారూపములోని కనకవలయ ముచే, వేల్లిత = చుట్టబడిన, ఏకతరబాహుదండ యుగళః = రెండు బాహుదండద్వయములో (క్రిందికి చాచిన) ఒక బాహుదండ యుగళమును కల్గినవాడు.

**20. యుగపదుదిత కోటిఖరకర హిమకర మండల జాజ్జ్వల్యమాన సుదర్శన పాంచజన్య సముత్తుంగిత శృంగాపరబాహుయుగళః,**

యుగపత్+ఉదిత = ఒకే మారు ఉదయించిన, కోటి = కోట్ల సంఖ్యలోని, ఖరకర= సూర్యులయొక్క, హిమకర = చంద్రులయొక్క, మండల = మండలముల వలె, జాజ్జ్వల్యమాన = మిక్కిలి ప్రకాశించు, సుదర్శన పాంచజన్య= సుదర్శన పాంచజన్య ములను కల్గినవి, సముత్తుంగితశృంగ = మిక్కిలి ఉన్నతములుగా చేయబడిన పర్వతశిఖరములవంటి, అపర = వేఱొక, బాహుయుగళః = బాహుద్వంద్వమును కలవాడు.

**21. అభినవశాణ సముత్తేజిత మహామహానీలఖండ మదఖండననిపుణ నవీన పరితప్త కార్తస్వరకవచిత మహనీయ పృథులసాలగ్రామ పరంపరాగుంఫిత నాభిమండలపర్యంత లంబమానప్రాలంబదీప్తి సమాలంబిత విశాలవక్షఃస్థలః,**

అభినవ = కొత్తదైన, శాణసముత్తేజిత = ఒరపిడి రాయిపై సాన పెట్టబడినదై, మహా =గొప్పదైన, మహానీలఖండ = మహానీలమను రత్నఖండముయొక్క, మదఖండన= గర్వమును ఖండించుటలో, నిపుణ = సమర్థమైనది, నవీన = కొత్తగా, పరితప్త = బాగుగా కాచి శుద్ధి చేయబడిన, కార్తస్వర = బంగారముతో, కవచిత = కవచముతో ఆవరింపబడిన, మహనీయ = గొప్పవైన, పృథుల = పెద్దవైన, సాలగ్రామ = సాలగ్రామ శిలలయొక్క, పరంపరా = వరుసలచే, గుంఫిత= కూర్పబడినదై, నాభిమండలపర్యంత= నాభి మండలములవరకు, లంబమాన= వేలాడు, ప్రాలంబ = మాలికయొక్క, దీప్తి= కాంతిచే, సమాలంబిత = ఆలంబనముగా గొనబడిన, విశాల = విస్తృతమైన, వక్షఃస్థలః = వక్షఃస్థలమును కలవాడు.

**22. గంగార్ఝురతుంగాకృతిభంగావలిభంగావహసౌధావలిబాధావహ ధారానిభ హారావళిదూరాహత గేహాంతరమోహావహమహిమమసృణిత మహాతిమిరః,**

గంగార్ఝుర = గంగాప్రవాహముయొక్క, తుంగ = ఉన్నతమైన, ఆకృతి= ఆకారమును కల, భంగ+ఆవళి = కెఱటాల సమూహముయొక్క, భంగ+ఆవహా= భ్రమను కల్గించునవి, సౌధావళి = సౌధముల వరుసకు, బాధావహ = బాధను

కల్గించునవి, ధారానిభ = జలపాతములవంటివి అగు, హారావళి = హారముల వరుసచే, దూర+ఆహత=దూరము తరిమి వేయబడిన, గేహ+అంతర= గర్భాలయములోని, మోహ = భ్రమను, ఆవహ = కల్గించు, మహిమ = ప్రభావమును కల, మసృణిత = చిక్కని, మహాతిమిరః = గొప్ప చీకటిని కలవాడు.

**23. పింగాకృతిభృంగారునిభాంగార దళాంగామల నిష్కాసిత దుష్కార్యఘ నిష్కావళి దీపప్రభ నీపచ్ఛవి తాపప్రద కనకమాలికా పిశంగితసర్వాంగః,**

పింగ+ఆకృతి=ఎఱ్ఱని వర్ణమును కల్గిన, భృంగారునిభ= బంగారమువంటి, అంగారదళ = అగ్నికణములచే, అమల = శుద్ధమైనది, నిష్కాసిత = దూరము చేయబడిన (పారద్రోలబడిన), దుష్కారి+అఘ = పాపుల పాపములను కల్గినది, నిష్కావళి = బంగారు దీనారాలు, దీపప్రభ = దీపముల కాంతి, నీప = కడిమెపూలు – అను వీనియొక్క, చ్ఛవి = కాంతికి, తాపప్రద = తాపమును కల్గించునది(అనగా– వీటిని మించినది) అగు, కనకమాలికా = బంగారు మాలికచే, పిశంగిత = పింగవర్ణముతో కూడుకొనునట్లు చేయబడిన, సర్వ+అంగః= సమస్త అవయములను కలవాడు.

**24. నవదళిత దళవలిత మృదులలిత కమలతతి మదవిహతి చతురతర పృథులతర సరసతర కనకసర మయరుచిర కంఠికా కమనీయకంఠః,**

నవదళిత = కొత్తగా విచ్చుకొనిన, దళ = రేకులతో, వలిత = చుట్టబడి యున్న, మృదుల = సుకుమారమైన, లలిత = అందమైన, కమల = కమలముల, తతి = సమూహముయొక్క, మద = గర్వము, విహతిచతురతర= పోగొట్టుటలో మిక్కిలి సమర్థమైన, పృథులతర=మిక్కిలి పెద్దది, సరసతర = మిక్కిలి సరసమైనది, కనకసర మయ = బంగారు సరములతో చేయబడినది అగు, రుచిర = అందమైన (ప్రకాశించు), కంఠికా = కంఠిక (కంటి) అను కంఠాభరణముచే, కమనీయ= అందమైన (ఆకర్షించు), కంఠః = కంఠమును కలవాడు.

**25. వాతాశనాధిపతిశయన కమనపరిచరణ రతిసమేతాఖిల ఫణధరతతి మతికర కనకమయనాగాభరణ పరివీతాఖిలాంగావగమిత శయనభూతాహిరాజ జాతాతిశయః,**

వాతాశనాధిపతిశయన = ఆదిశేషుడనే పడుకలో, కమన = కోరికను కల స్వామియొక్క పరిచరణ = సేవయందలి, రతి = ఆసక్తితో, సమేత = కూడియున్న, అఖిలఫణధరతతి = సమస్త సర్పసమూహమా ఇది! అను, మతికర = భావనను కల్గించునది, కనకమయ = బంగారముతో చేయబడినది అగు, నాగ+ఆభరణ= నాగాభరణములను అలంకారములచే, పరివీత = చుట్టబడిన, అఖిల+అంగ = సమస్తాంగములందు, అవగమిత = తెలిసికొనబడిన, శయనభూత = శయనముగా నున్న, అహిరాజ = ఆదిశేషునివలన, జాత = కల్గిన, అతిశయః = అతిశయమును కలవాడు.



**26. రవికోటీ పరిపాటీ ధరకోటీర వరాటీకితవాటీరసధాటీ ధరమణిగణ కిరణ విసరణ సతతవిధుత తిమిరమోహగర్భగేహః,**

రవికోటీ = కోటిసూర్యుల, పరిపాటీధర = క్రమమును ధరించు (సామ్యమును కల), కోటీరవర = గొప్ప కిరీటములోని, ఆటీకిత = వ్యక్తం చేయబడిన, వాటీ = తమ స్థానాలలోని, రస = శోభన యొక్క, ధాటీ = గొప్పతనాన్ని, ధర = ధరించే, మణిగణకిరణ = మణుల సమూహముయొక్క కిరణముల, విసరణ = వ్యాప్తిచే, సతత = ఎల్లప్పుడు, విధుత=దూరముగా తఱుమబడిన, తిమిర మోహ= చీకట్లవలన కల్గు, మోహభ్రాంతిని కల్గిన, గర్భగేహః= గర్భగృహమును కలవాడు.

**27. అపరిమిత వివిధభువనభరితాఖండ బ్రహ్మాండమండల పిచండిలః,**

అపరిమిత = అంతు లేని, వివిధ = అనేకవిధాలైన, భువన = లోకాలతో, భరిత = నిండిన, అఖండ = సమస్త, బ్రహ్మాండమండల = బ్రహ్మాండ మండలాలను కల, పిచండిలః = పెద్ద ఉదరాన్ని కలవాడు.

**28. ఆర్యధుర్యానంతార్య పవిత్రఖనిత్రపాత పాత్రీకృత నిజచుబుకగత వ్రణకిణ విభూషణవహన సూచితశ్రిత జనవత్సలతాతిశయః,**

ఆర్యధుర్య = ఆచార్యవర్యులగు, అనంతార్య = అనంతార్యులయొక్క, పవిత్ర= పవిత్రమైన, ఖనిత్ర = గడ్డపారయొక్క, పాత = దెబ్బకు, పాత్రీకృత= పాత్రముగా చేయబడిన, నిజచుబుకగత =తన గెడ్డమునందుగల, వ్రణకిణ= గాయము గుర్తును, విభూషణ = గొప్ప అలంకారముగా, వహన = కల్గి యుండుట ద్వారా, సూచిత = సూచింపబడిన, శ్రితజనవత్సలతాతిశయః = అతిశయించిన వాత్సల్యగుణమును కలవాడు.

**29. మద్దుడిండిమ డమరుఝుర్ఝుర కాహళీ పటహావళీ మృదుమర్దలాలి మృదంగ దుందుభి ఢక్కికాముఖ హృద్యవాద్యక మధుర మంగళ నాదమేదుర విసృమర సరసగాన రసరుచిర సంతతసంతన్యమాన నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవ సంవత్సరోత్సవాది వివిధోత్సవ కృతానందః,**

మద్దు = మద్దు అను, డిండిమ = డిండిమమను, డమరు = డమరుకమను, ఝుర్ఝుర =ఝుర్జరమను, కాహళీ = కాహళి అను, పటహ = పటముల

అను, ఆళీ = సమూహములచే, మృదు = సున్నితమైన, మర్దల = మద్దెలల, ఆవళీ = సమూహముచే, మృదంగ = డోలు, దుందుభి = దుందుభి, ఢక్కికా = ఢక్క, ముఖ = మొదలగు, హృద్య = హృదయావర్జకములగు, వాద్యక = వాద్యములనుండి వెలువడు, మధుర = తీయని, మంగళనాద = మంగళ వాద్యములచే, మేదుర = దట్టముగా, విస్పుమర = వ్యాపించు, సరసగాన= రసవంతమైన గానముల, రస = రసముచే, రుచిర = అందమైనవి, సంతత = ఎల్లప్పుడు, సంతన్యమాన = బాగుగా విస్తరింపబడుచున్న, నిత్యోత్సవ = ప్రతి దినము జరుగు ఉత్సవములు, పక్ష+ఉత్సవ = పక్షోత్సవములు, మాస+ ఉత్సవ= ప్రతిమాసములో జరుగు ఉత్సవములు, సంవత్సర+ ఉత్సవ = సంవత్సరోత్సవ ములు, ఆది = మొదలగు, వివిధ+ఉత్సవ = పలు ఉత్సవములచే, కృత+ఆనంద= ఆనందమును కలుగచేయబడినవాడు (భక్తులకు ఆనందమును కల్గించువాడు).

**30. శ్రీమదానందనిలయవిమానవాసః,**

సంపత్సమృద్ధిని (కాంతిని) కల ఆనందనిలయమను విమానమును వాసముగా కలవాడు.

**31. సతతపద్మాలయాపదపద్మరేణుసంచితవక్షఃస్థలపటవాసః,**

సతత = ఎల్లప్పుడు, పద్మాలయా = లక్ష్మీ (పద్మావతీ) దేవియొక్క, పదపద్మ= పదములను పద్మములయొక్క, రేణు = పుప్పొడితో, సంచిత = నిండిన (కూడు కొనిన), వక్షఃస్థలపటవాసః = వక్షఃస్థలంలో అలదబడే సుగంధ చూర్ణాన్ని (బుక్కాను) కలవాడు అగు.

**32. శ్రీశ్రీనివాసః సుప్రసన్నో విజయతామ్**

శ్రీశ్రీనివాసుడు భక్తుల పట్ల సుప్రసన్నుడై వర్ధిల్లుగాక ।

**శ్రీరంగసూరిణేదం శ్రీశైలానంతసూరివంశ్యేన ॥**
**భక్త్యా రచితం హృద్యం గద్యం గృహ్ణాతు వేంకటేశానః ॥**

శ్రీశైలానంత సూరివంశ్యేన = శ్రీశైలానంతార్యుల వంశమునందు జన్మించిన, శ్రీరంగసూరిణా = శ్రీరంగాచార్యులను విద్వాంసునిచే, భక్త్యా = భక్తితో, రచితం= రచింపబడిన, హృద్యం = అందమైన, ఇదం= ఈ, గద్యం= గద్యమును, వేంకటేశానః= వేంకటేశ్వరుడు, గృహ్ణాతు = గ్రహించుగాక!

Printed at TTD Press, Tirupati. C.2000-Free Booklet-2016